# 1

వేయవోయ్ మగవాడ "ముందడుగు వేయవోయ్
వేయవోయ్ -
ముందడుగు వేయవోయ్;
వెనుక పడితే
వెనుకే నోయ్—"

"అమ్మా! ఈడొచ్చిన పిల్లవు. పెళ్ళి చేసుకోకుండా ఎంతకాలం ఉండగలవ్? నేటివరకూ మా రెక్కలమాటున దాచి పెంచుకున్నాం. నేడో రేపో మా రెక్కల నామృత్యుదేవత ముక్కలుచేస్తే, నీవెక్కడ తలదాచుకోగలవ్?

అమ్మా! మణీ! ప్రతిపిట్టకూ ఒకచెట్టు అవసరం. చెట్టే కాదు- చెట్టుమీద ఉండడానికి గూడు ఎంతఅవసరమో, స్వేచ్ఛగా ఎగరడానికి ఆకాశమూ అంతే అవసరం. గూట్లోనే శాశ్వతం ఉంటే, రెక్కలు సాగక మురికిజీవం అవుతుంది. అలాగే ఎప్పుడూ గాలిలో ఎగురుతూఉంటే, చీకట్లో దారి తప్పి, గుడ్లగూబలకు గురి అవుతుంది.

మణమ్మా! ప్రతిస్త్రీకి పెంచిన తల్లిదండ్రులెంతఅవసరమో, శాశ్వతం పోషించే భర్తా అంతే అవసరం.

ఒక్కమాట చెబుతా వినుతల్లీ! పెళ్ళిచేసుకుంటం కేవలం భర్తనేవాడొకడు పోషిస్తాడనే కాదు. జీవితంలోని కష్టసుఖాలు చెప్పుకుంటానికైనా ఒకడుండాలికదూ? అతడేభర్త.

పెరిగే పెరిగే లతకు ఏదో ఆశ్రయం ఉండకపోతే, విచ్చలవిడిగా మిన్నంటా పాకిపోగలదా? ఆలోచించు... అంచేత నీకు నచ్చినవానిని- మాచూపు మట్టిలో చొచ్చుకుపోకుండానే- పెళ్ళిచేసుకోతల్లీ!"

తల్లి అలా రోజూ చెబుతూ ఉండేది. ఆమె చెప్పిన మాటలన్నీ మననం చేసుకుంటూ మణెమ్మ చెరువులో బట్టలు ఉతుక్కుంటూ ఉంది.

మణి తల్లి పార్వతమ్మ పోయినప్పటినుంచీ సంసార భారం అంతా మణేవహించవలసి వస్తూంది. ఎన్నికష్టాలైనా రానీయ్, చిరునవ్వుతో స్వీకరిస్తుంది. కాలప్రవాహానికి ఎదురీత కొట్టాలనేదే ఆమె దృఢసంకల్పం. ఏటవాలుగా పడిపోవడం పిరికివాళ్ళలక్షణం అని ఆమె నిశ్చితాభిప్రాయం.

మణి తనలో తానేదో నిమ్మదిగా పాడుకుంటూ- బట్టలు ఉతుక్కుంటూంది.

అంతలో మునసబుశోభనంగారి కుమారుడు సుబ్బయ్య పరుగు పరుగున ఆతృతతో ఆమె దగ్గరకొచ్చి నిలబడ్డాడు.

అతడ్ని చూసీ చూడనట్లామె నటిస్తూంది.

"ఏయ్! ఇదిగో!"

ఆమె తలెత్తి చూడలేదు.

"ఇదిగో— నీకే—"

ఆమె గొంతు హెచ్చించి పాడుతూంది.

"ఏయ్! నీకే— నిన్నే— చెవుడా?"

ఆమె వాలుజడ త్రాచు కదిలినట్లు కదలగా తలఎత్తి చూచింది, అతగాడు ఖిన్నుడైపోయాడు.

"ఏయ్! 'ఏయ్' ఏమిటి?"

"తప్పా?"

"తప్పా తప్పన్నరా! సొంతపిల్లాన్ని పిలిచినట్లే పిలుస్తున్నావే?"

"పిల్లాళ్ళల్లోకూడా సొంతం, ఎరువని ఉంటారా?"

"పేరుపెట్టి పిలవలేవ్?"

"పిలవకూడదన్నారుగా పెద్దలు?"

"ఏం? నా పేరేమైనా చెడిపోయిందా?

విషమాత్రరాలతో ఏకవి అయినా కూర్చాడా?"

"అబ్బే! అందుకాదు."

"మరింకెందుకు?"

అతని ముందుకొచ్చి నిలబడింది.

'ఎవరిపిల్లాం పేరు వారు చెప్పకూడదన్నారుగా.

'అయితే నీ పిళ్ళాన్నా?'

"అవుతావనే కదూ?'

'తాలిబొట్టు కట్టి తలంబ్రాలు పోశావా?'

"పోయించాలనేకదూ తీసుకు రమ్మన్నాడు!'

"ఎవరు?"

"ఇంకెవరు? మీనాన్న - మామావ.'

"చాల్లే, ఊరుకో. నా పెళ్లికి అంగు నెవరు?''

'మీనాన్న మరచావా? మా ఘూవ—'

"పిచ్చిపిచ్చిగా వాగక —'

ఆమె మళ్ళీ రేవులో దిగింది. కుబుసం తీసిన తెల్లతా చులా కోపంతో బుసబుస పొంగిపోతూంది.

ఆమె ఎవరేది చెప్పినా వింటుంది. తనకుతోచింది చెబుతుంది. కాని 'పెళ్ళి' అంటేచాలు- కనకనమండే నిప్పులు కక్కుతుంది.

నాలుగు నిమిషాలలాగే నిలబడ్డాడు సుబ్బన్న. ఆమె అలాగే బట్టలు ఉతుక్కుంటూ ఉంది.

మణమ్మా!'

"ఊఁ; ఏఁ?"

'ఇలా ఎంతసేపు నిలబడాలి?''

'నీఇష్టంవచ్చినంతసేపు, నేనేమైనా నిలబడమన్నానా?''

'మరి నీవురాకపోతే ఎలా?''

'నేనెందుకు?'

'మీనాన్న నిలబడినట్లుగానే తీసుకురమ్మన్నాడు—'

"ఎందుకు?'

పాపం! పోయే ప్రాణం, వచ్చేప్రాణం పోష ఎగ తన్నుతూంది.'

'అయితే.'

'గుక్కెడు ప్రాణం గుడిదాటిపోకుండానే నీకూ నాకూ నాలుగక్షింతలు వెయ్యాలని— తుదికోరిక పోతే పాడుప్రాణి పోదు——"

"చచ్చినట్లే ఉంది'

'రామ, రామ, చావందే. చస్తూ చస్తూ ఉన్నాడు.

'ఆయనమాటకాదు; ఆయన ఉద్దేశంమాట.'

'అలాగా.'

"ఇంకేలాగనుకున్నావ్?

'ఎలాగా అనుకోలేదు. ఎలా అనుకోమంటే అలాగే అనుకుంటా. నీగిరిదాటతానా?"

'చాల్లే కానీ పద.'

'సరే, ముందునే దిగెడతాను. నీవు వెనకాల నెమ్మదిగానే రా.'

'ఏం?'

"ముందు వెళ్ళకపోతే, ఆకాన్తప్రాణాలూ గుటుక్కుమంటే, మన అంక్షితలు అగువు కాతాలో పడినట్లు, ఔుండిగుంటవు. నామాటింటావ్?"

'చాల్లే సరసం. పద, పద—'

ఇద్దరూ కలిసి మణమ్మ పాతకొంప చేరుకున్నారు.

♦ ♦ ♦ ♦

అది నులకమంచం.

మణి తండ్రి రావన్న మరణవేదన అనుభవిస్తూ,ఉన్నా డు. మణిలోపలకువెళ్ళి బిందీ బట్టలూ గదిలోపెట్టి తండ్రిదగ్గర కొచ్చి మంచంమీద కూర్చుంది.

''అమ్మా! మణీ!''

"ఏం నాన్నా?'

'అయిపోయిందమ్మా నావని.'

'దానికి విచారం ఎందుకునాన్నా! వెనుకా ముందుగా అందరిపనీ అయిపోవలసిందే.పుట్టినవారు గిట్టకుండాఉంటారా? గిట్టినవారు పుట్టకుండా ఉంటారా? ఈజీవరథచక్రం ముక్తిమం టపం చేరేవరకూ తిరుగుతూ ఉండవలసిందేగా? ఇందులో తప్పేదేముంది?'

"అమ్మా! మాసిపోతుందమ్మా నాబతుకు.'

నీబతుకేకాదునాన్న ఈసకలచరాచర ప్రపంచం అంతా ఏదో ఒకనాడు నామరూపాలు లేకుండా మాసిపోవ లసిందే. తప్పదు. విధాతకూడా తప్పించలేడు."

'అమ్మా!"

"నాన్నా! అయ్యో! ఎందుకీ కన్నీళ్ళు. మనజీవితాల నెలా ప్రేమిస్తామో, మన మృత్యువునుకూడా అలాగే ప్రేమిం చాలినాన్నా!ఒకరూపాయికి చక్రవర్తిముద్ర ఎంతముఖ్యమో, అటు అక్షరాలుకూడా అంతేముఖ్యము. వానిలో ఎక్కువ తక్కువలులేవు. అలాగే జీవితం అనే రూపాయికి ఒకవైపు

ముద్రి "పుట్టుక" మరొకవైపు ముద్ర "చావు" ఈచావు పుట్టుకలు రెండూ జీవితం అనే నాణ్యానికిఒకటే నాన్నా!

చూడండీ! రూపాయి ఎంతమంది చేతుల్లోనుంచో జారిపోతుంది. కొందరిని నవ్విస్తున్నది. కొందరిని ఏడిపిస్తుంది. రూపాయిచేతికి రాగానే ప్రతివాడూ- మహాత్ములుతప్ప- పొంగిపోతాడు. చేతినుంచి జారిపోగానే కృంగిపోతాడు. జీవితం ఇంతే. మనం పుట్టగానే ఆనందం; గిట్టగానే దుఃఖం.

నాన్నా! ఇలా నవ్వించి, ఏడ్పించి, ప్రజల నాడించిన ఆరూపాయి అరిగి పోగానే ప్రభుత్వం మళ్ళీటంకసాలలో కరిగిస్తుంది. పోతపోస్తుంది. కొత్తరూపాయిగా దానినే తయారుచేస్తుంది. దానికా రూపాయిగాని, ఆరూపాయిని వదులుకున్న బంధుకోటిగానీ విచారించడం ఎందుకు?

అలాగే ఈజీవితం వార్ధక్యంలో అరిగిపోతుంది. మృత్యుమందిరంలో మళ్ళీ పోతపెట్టబడుతుంది. దానితో మరింత పదునుగా, మరింత కొత్తగా తయారౌతుంది. ఇందుకు విచారం ఎందుకు? పైపెచ్చు సంతోషించాలి. ఏమంటారు!'

'ఏమంటాను తల్లీ! అంతా అవునంటాను. ముళ్ళచెట్టుకు గులాబీపువ్వులా నీవుమాకడుపున పుట్టావ్ తల్లీ! ఇవన్నీ నేను చెప్పినవైనా, మరణకాలంలో మరచిపోయాను. మళ్ళీ జ్ఞాపకంచేసి ధన్యుడ్ని చేశావు తల్లీ!

అమ్మా! బాగా బ్రతికున్నంతకాలం వ్యామోహాన్ని పిరికితనాన్ని దగ్గరకు చేరనీయకూడదూ! అంటూ ఆమె కన్న

"నాన్నా! కోరికలకు "తుది" ఏముంది? చచ్చేవరకూ కోరికలుంటాయ్. చచ్చింతరువాతకూడా కోరికలుంటాయ్. దీనికి అంతెక్కడిది నాన్నా!"

'అమ్మా! నాముద్దు చెల్లింతవా!'

"... ... ..."

"నా ఆశ నిరాశచేస్తావా తల్లీ,"

"నేనేం చేశాను నాన్నా !"

"నా తరువాత "నా" అనే వారెవరమ్మా నీకు?"

"భగవానుడు."

"వేదాంతం తిండీ బట్టా ఇవ్వలేదమ్మా!"

"తిండీ బట్టా ఇవ్వలేదు. కాని అవి దొరికే మార్గం చూపిస్తుంది. ద్వారాలు తెరిచి సత్యపదాన్ని సున ముంగా పరీక్షింప చేస్తుంది. అనుకున్నా పనినల్లా ఆచరించడానికి ఆత్మీయశక్తినిస్తుంది.

అతడు రెండు నిమిషాలు మాట్లాడకుండా కళ్ళుమూసుకొని బాధ ననుభవించాడు. తరువాత కళ్లు తెరచి దీనంగా కూతురువంక చూశాడు.

"ఏం నాన్నా !"

"అమ్మా! నీవన్నా నా చెప్పు. నిన్ను సుబ్బయ్య చేతుల్లో విడిచిపెడితే, నా ఆత్మ శాంతిగా ఆకాశపథంలో ప్రయాణించేస్తుంది. లేకపోతే..."

"భయపడకు నాన్నా!"

"అమ్మా! ఆడవారికి ఒకరి ఆశ్రయం అవసరంతల్లీ! అందులోనూ యౌవనంలో ఉన్న వారికి అతి అవసరం... చెట్టు ఎదిగేవరకూ చుట్టూ కంచె అవసరం. లేకపోతే దోవను పోయే ప్రతి మేకా చివుళ్ళు మేస్తుంది. ప్రతి ఎద్దూ కొమ్ములు విరిచి తొక్కి పారేస్తుంది. చెట్టు పెద్దదయ్యాక ఏ అవసరం లేదు ..అలాగే స్త్రీకి కూడా యౌవనంలో రక్ష ఉండాలి"

"నాన్నా! చెట్టులకు స్వరక్షణ శక్తిలేదు. మానవుల కుంది. నీవు భయపడకు నాన్నా! నన్ను నేను రక్షించుకో గలను. ఆ ధైర్యం, ఆ ఆత్మ విశ్వాసం నాకు లేకపోలేదు.'

"స్వార్థ భూయిష్ఠమైనది. సంఘం; కామార్తులు ప్రజలు; నీవు పేదరాలువు–ఏకాకివి. ఎన్ని కష్టాలు ఎదుర్కో వలసి ఉంటుందో ఆలోచించుకో."

"ఆలోచించుకొన్నాను.ఏకాకిగా ఉండడానికే నే నిశ్చ యించుకొన్నాను. ఎన్ని కష్టాలకైనా ఎదురీదుతాను. సంఘా నికి "ముందడుగు" వేస్తా. సంఘాన్ని నా వెనుక నడిపిస్తా.'

"అహంకారం హానికరం తల్లీ!"

"ఇది అహంకారం కాదునాన్నా! ఆత్మశక్తి; ఆత్మ ప్రబోధం."

'అయితే సంతోషం.'

"నాన్నా! మీ మాట జవదాటననుకోకండి. ఏనాడు నాకు పెళ్ళి అవసరం అని తోస్తుందో, ఆనాడు తప్పకుండా

చేసుకుంటా. కాని అంతవరకు ఈ జీవితాన్ని ప్రజాసేవలో వినియోగించనీయండి. నాకంటే అజ్ఞానులు అంధత్వం బాపటంకంటే ఆనందం మరొకటిలేదు.

నాన్నా! ఈ ప్రపంచ యజ్ఞంలో నన్ను ఆహుతికానియ్. ప్రజాసేవకై నన్ను అంకితంచనియ్. అంతకంటే కావలసిందేముంది?

మోసం—రోషం — ద్రోహం — ద్వేషం— ఈ నాలుగు కులాలనూ రూపుమాపనీయ్. ఇందుకు తగినంత ఆత్మశక్తి అలవడేందుకు ఆశీర్వదించునాన్నా. అంతకంటే నిన్ను అర్థించేదేమీలేదు."

మణి ముఖం ఎర్రగా కందిపోయింది. కనులు కన్నీటి తెరల ముసుగువాటు కదిలిపోతూన్నాయ్.

రావన్న ఆమె సత్ సంకల్పాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నాడు. ఆనందాశ్రులు రాల్చాడు.

మణమ్మా! అర్థం అయింది. అగ్నిగుండాలను రగుల్చుకుంటున్న నీహృదయం అర్థం అయింది. నీవు అబలవుకావు. సబలవు. సంఘ రథసారథివి. అడుగువేయ్ తల్లీ! "ము ం ద డు గు" వేయ్.'

అమ్మా! ప్రజాభ్యుదయానికై పాటుపడు. ప్రజలకొరకై ప్రాణాలు బలిసేయ్.

దేశమాత కన్నీళ్లు తుడిచే వీరమాతవు కావాలి! వీరమాతవుగా...భరతమాత నిన్నాశీర్వదిస్తుంది...భగవానుడు

నీకు తోడ్పడతాడు. తప్పక తోడ్పడుతాడు. పేదలంటే అతనికి ప్రాణాలు.

అభాగిని ఎలుగెత్తి ఒక్కసారి "ప్రభూ!" అని అరచిందా, అంటే అతని సింహాసనం కదిలిపోతుంది. అభాగినుల హృదయాలే అతని ఆలయాలు...భయపడకుతల్లీ! భగవానుడు నిన్ను రక్షిస్తాడు...వీరమాతవుగా...

అమ్మ! అదెవరు? అదెవరు?

భగవానుడునాన్నా! భగవానుడు.

భగవానుడే...భగవానుడా.

ఆఁ అతడే-నిన్ను రక్షించాలని...

వచ్చాడా?

అవును. వచ్చాడు.

అయితే ఆ తలుపులన్నీ తెరచేయ్...అబ్బా! ఏమి తేజస్సు...ఇంత తేజస్సు ఈ కళ్లు నాడగలవా? ఎంత తేజస్సు..

అతడు కన్నులు మూసేశాడు.

నాన్నా! నాన్నా!

గొల్లుమని అతనిమీద పడిపోయింది మణి.

"ప్రి...జా...సే...వకై...ముందడుగు వేయ్...

"ముం...ద...డు...గు"

మూసిన కన్నులు తెరువలేదు.

అతని ఆత్మ ఆకాశంమీద నక్షత్రం అయిపోయింది.

అతని జీవన రథసారథి రథందిగి విశ్రాంతి తీసుకుం టానికి వెళ్ళిపోయాడు.

గుళ్ళో గంట ఠంగ్ ఠంగ్‌మని కొడుతున్నారు.

• • •

అతనిపై ముసుగువేసింది కన్నకూతురు.

'మణీ...విచారించకుతల్లీ! నేనున్నానుగా అన్నిటికీ. మునసబు మాటలువిని మళ్ళీ గొల్లుమంది.

ఏమంటే ఏముంది—

అతని జీవనజ్యోతి ఆరిపోయింది. అంతే

——

# ii

రావన్న దహన సంస్కారాలనుంచి దినవారాలవరకూ మునసబు శోభనమే మణికి సాయంచేశాడు.

పెద్దదినం ఇంకా రెండురోజులుంది. ఊరిలో ఎవరెవ రిని భోజనాలకు పిలుద్దాం అని ఆలోచిస్తున్నారు! శోభనం— మణి.

మణమ్మా! రావన్న బడిపంతులైనా బాగాబతికాడు.

అలాగే.

అందుచేత అతనంటే ఊరందరకూ చాలాఇష్టం.

అలాగే.

కాబట్టి నాలుగిళ్లు ఇడిచిపెడితే లాభం ఏముంది? ఊరందర్నీ పిలిచేస్తే సంతోషిస్తారు.

సంతోషించడానికి ఇదేమీ పెళ్ళిభోజనంకాదు మావయ్యా!

కాదనుకో. ఎంతమంది భోంచేస్తే నచ్చినోడి ఆత్మకి అంత మంచిదట.

"నాలుగు 'ఊట' లు శే( ) మనలను 'సుంట'లుజేశారునేటివరకు. నేటికైనా కళ్ళు తెరిచి ప్రియుక నాటకాన్ని చూడకపోతే ప్రయోజనం ఏముంది? ఎంతకాలం గడిచినా ఏనుగు ఎలకాయే తింటుంది. పులి మాంసమే తింటుంది. పశువు గడ్డే మేస్తుంది. జంతువుల్లో సృష్ట్యాదినుంచి అంతవరకూ ఆహార విహారాల్లో మారుపుండదు. కాని మనుషులలా కాక. మృగప్రాయంగా ఉన్నప్పుడు మాంసాహారులయ్యారు. మానవత్వం అలవడగానే శాకాహారులయ్యారు. రేపు దైవత్వం అలవడితే నిరాహారులౌతారు. అలా మానవులలో ఉన్న పరిణామం మృగాదులలో ఉండదు. కారణం వాటికి విజ్ఞానంలేదు; మనకున్నది.

కాబట్టి మావయ్యా! ఏ కాలంలోనో, ఎవరో, ఎక్కడో, ఏదో చెప్పారని మనం ఇప్పుడు—గుడ్డెద్దు చేలోబడినట్లు—చేయకూడదు. ఒక పనిచేసేటప్పుడు మన బుద్ధికుశలతను ఉపయోగించి "ఈ పనిచేయడం ధర్మమా! అధర్మమా!"

అని ఆలోచించి చేయాలి. పరిశీలించాలి-తర్కించాలి-కార్యం చేసి తరించాలి.”

మునసబు విస్తుపోయాడు.

ఏం మాటాడాలో అర్థంకాలేదు.

ఆమె చెప్పిందంతా కొత్తగా ఉంది.

“మణమ్మా! అయితే ఊరంతా పిలువొద్దంటావ్?”

అవును.

ఎంతమందిని పిలుద్దాం

ఎంతమందినీ వద్దు.

అతడాశ్చర్యపోయాడు.

అంటే-అసలు పెద్దదినమే వద్దంటావా!

వద్దనే నా ఉద్దేశం.

అంతపని చేయకు మణమ్మా! పోనీ మన నలుగురం కలిసి చేద్దాం. కావాలంటే ఆ డబ్బు నే...”

అబ్బే! డబ్బుకాదు. అవసరంలేదేమోనని...”

మన హిందూ ధర్మం ఒప్పుత్తా.

ఒప్పుతుంది కాబట్టే.

ఎట్లా?

మనకు ప్రమాణం గ్రంథం ఏది?

పద్దుల పుస్తకం.

అది కాదు మానయ్యా! భగవద్గీత.

ఓహో... అయితే,

దాంట్లో ఏముందో తెలుసా!
ఎలా తెలుస్తుంది. పుస్తకమే చూడందే.
అయితే దాంట్లో ఇలాగుంది—
శ్లో॥ దేహినః, అస్మిన్ యథా దేహే,
కౌమారం, యౌవనం, జరా—
తథా దేహాంతర ప్రాప్తిః,
ధీరః, తంత్ర నముహ్యతి.
"అంటే"

"ఈ దేహంలో కౌమారుదశ, యౌవనదశ. వార్ధక్యం ఎప్పుడిలా వెళ్ళిపోతున్నాయో, అలాగే ఈ ఆత్మ ఈ శరీరాన్ని విడిచి మరో శరీరాన్ని ధరిస్తుంది. అందుచేత ఈ శరీరాన్ని గురించి ధీరులు మోహింపబడరు."

"అయితే ఏమంటావు!"

"ఈ ఆత్మ ఏ క్షణంలో ఈ శరీరాన్ని విడిచిందో, ఆ క్షణంలోనే మరో శరీరాన్ని ధరిస్తుంది.

"అయితే నరకంలో ఎప్పుడుంటుంది!"

"ఎప్పుడూ ఉండదు."

"అదేంటి!"

"మావయ్యా! స్వర్గనరకాలు కల్పితాలే కాని యదార్థాలు కావు."

"అయితే లేవంటావా!"

"ముమ్మాటికి."

మన పెద్దలు చెప్పిందంతా అబద్ధమే.”

“తప్పక. వారెందుకు కల్పించారంటే—సామాన్యులకు ‘నరకయాతన’ ఉన్నదనుకూ నీవు తప్పులుచేస్తే అది చెబుతేగాని భయపడి మానేయురు. అలాగే మంచి పనులు చేస్తే ‘స్వర్గసుఖం’ వస్తుందనుచూ అని బోధిస్తేగాని మంచి పనులు చేయరు. తెలిసిందా? మనచే చెడ్డపనులు మాన్పించి, మంచిపనులు చేయించే నిమిత్తమే స్వర్గ నరకాలను సృష్టించారు. వారి ఆశయం మంచిదే. ప్రజలను చీకటినుండి వెలుగునకు నడిపించేదే.”

“అయితే మణమ్మా! మరి చచ్చినవాళ్ళకు గోదానాలు, భూదానాలూ, సువర్ణదానాలూ చేస్తామే అదంతా బూటకమే.”

“బూటకమా, మహా నాటకమా? మన పూర్వులు ‘సర్వేజనో సుఖనో భవంతి’ అని—ప్రజాభ్యుదయానికి కొన్ని నీతులు చెబుతే, వాటికి విరుద్ధ వ్యాఖ్యానంచేసి ఈ స్వార్థపరులు ప్రజలను పీంకి పిప్పిచేస్తున్నారు...”

“అలాగా!”

“ఒక్కమాట చెబుతావినూ—ఈ దానాలన్నీ పుచ్చుకొనేదెవరు?”

“మన గురువులే—బ్రాహ్మలు, శ్రీవైష్ణవులు, సాతానులు...”

"ఈ పుచ్చుకొన్నవారు చచ్చినవారి కెప్పుడైనా పంపించగా చూశావా!"

"ఎలా పంపిస్తారు? శుభ్రంగా పొలం దున్నించుకొని పండించుకుంటున్నారు. ఎక్కువైన ఆవుల్ని అమ్ముకొని మేడలు కడుతున్నారు. దానం ఇచ్చిన—బంగారంతో పెళ్ళాలకు, పిల్లలకు నగలు చేయిస్తున్నారు. చెమట చుక్క జారకుండా జీవిస్తున్నారు.

"వాళ్ళలా జీవించేటట్లు చేస్తుంది మీరు. మావయ్యా! మిమ్మల్ని తెలివితక్కువవాళ్ళను చేసి, ఈ లంచాలన్నీ గుంజే ఈ గురువులకంటే మహాపాతకులుండరు. కల్లూ పళ్ళూ తాకట్లుపెట్టి ఒక పాలేరివాడుకూడా ఈ సోమరి పోతులకు దానంచేస్తున్నాడే, వాడి ఉసురు వీళ్ళకు తగల్దూ...

మావయ్యా! ప్రేమించకపోయినా ప్రేమించినట్లు నటించి డబ్బుగుంజే వేశ్యల్లాగ- చచ్చినవాళ్ళకు ముఖ్యం దని చెప్పి, అమాయికుల నమ్మించి గో,భూ, సువర్ణ ఛత్రాంబరాలదానం పుచ్చుకొనే ఈగురువులు సంఘంలో చీడపురుగుల్లాగ బయలుదేరారు. కడుపునకు తిండిలేక దొంగతనం చేసే దరిద్రులను- కొరడాలతో కొట్టి, ఇనుపఊచల పంజరంలోని పక్షుల్లాబంధించే ఈప్రభుత్వం ప్రజలనెత్తురు పీల్చే ఈ భూలోక పిశాచలను- ఈమేకవన్నె పులులనుశిక్షించదెందుకో!

అయినా ప్రభుత్వానికి చెవులేగాని కళ్ళులేవు.

ఆమె ఉద్రిక్తురాలై పోయింది.

శోభనం ఆశ్చర్యపోతున్నాడు.

నాలుగు నిముషాలలాగే ఆమె చూస్తూంది.

మావయ్యా! ఈదానాలుచేసే వాళ్ళైనా నూటికి తొంబయిమంది నిష్కల్మషభక్తితో చేస్తున్నారంటారా? నేను నమ్మను.

మరెందుకు చేస్తున్నారు?

ప్రజల మెప్పుపొందాలని. లోకాన్ని వంచించి చచ్చిన వాళ్ళయందు తమభక్తి శ్రద్ధలు చాటించుకుందామని.

"అలాగంటావా?"

"కాకపోతే— చూడండీ మన భూషణాన్ని బ్రతికున్నంతసేపూ తండ్రికి కడుపునిండా కూడు పెట్టక కాల్చుకుతిన్నాడు జబ్బుపడితేమందుకూడా ఖర్చుపెట్టక వేధించుకు తిన్నాడే. అతడు చావగానే వేలకు వేలు కర్చుపెట్టి దినవారాలు చేస్తాడా? దానాలిస్తాడా? ఇదంతా తండ్రిమీదప్రేమా? తన 'మెప్పు' మీద ప్రేమా?

నలుగురూ మెచ్చుకుంటారనే మనకుమాత్రం తెలీదూ?

ఇప్పటికైనా తెలిసిందా?

చెప్పిం తరువాత తెలియదా? ఇంకచూసుకో ఈగురువులుగాళ్ళసంగతి...

మావయ్యా! మనతల్లిదండ్రులకుగాని, అత్తమామలకుగాని చచ్చేవరకూ వినయ విధేయతలతో సేవచేయడం

మనవిధి. చచ్చింతరువాత 'కర్మకాండ' మనదికాదు. భగవానునిది.

ఒప్పుకుంటావమ్మా! ఒప్పుకుంటా."

"చచ్చేవరకూ బాధించి, చచ్చింతరువాత పూజించడం ఎలాగుంటుందంటే— మనకళ్ళనుకుంటం ఊడతీసి నానుకోవాలని అనుకున్నట్లుంటుంది. కళ్లుతీసి వేలితో చూసుకుంటాం"

'అయితే మననలుగురం కలిసి ఏదో దండంపెడదాం'

"తప్పక"

'అమ్మా! నూమంచిమాటలు చెప్పావు తల్లీ! నలుగురికీ ఇలాగే చెబుతూఉందూ? కాసింత అజ్ఞానం అన్నా పోతుంది."

"చెప్పడంలో గొప్పలేదు; చెప్పినవి చేయడంలోగొప్పతనం ఉంది. కావలసినవి కబుర్లు కావు; కార్యాలు. వేయవలసింది "వెనకడుగు" కాదు; "ముందడుగు"

"అవు నమ్మ! అవును."

మునసబు ఆలోచనలో మునిగి తేలుతూ తన ఇంటికి వెళ్లాడు. తండ్రిని తలుచుకుంటూ మాణమ్మ తన యింట్లోకి వెళ్ళింది.



# iii

"ప్రహా! అహా!...ఆహాహా! హా...ఆఆ...అహా!ఆహా!
ప్రభో! ప్రభో! కావనా! దే...వా... ప్రభో! ప్రభో!"

ఏదో అలా పిచ్చిపిచ్చిగా పాడుకుంటూ మామిడి చెట్టుకొమ్మ మీద కూర్చుని ఊగుతూంది మణి.

ఆ అల్లరి పిల్లని దూరాన్నుంచే చూశాడు ప్రభోద్. తెల్లటి ఖద్దరులాల్చీ గాలికెరటాలకు ఎదురీదుతూఉంటే — పంచికుచ్చిళ్ళు చేత్తోపట్టుకొని నవ్వుతూ తయారయ్యాడు.

నెమ్మదిగా పిల్లి అడుగులువేసుకుంటూ ఆమె వెనకాలే నిలబడ్డాడు...అంతేగాదు. చెవిదగ్గరే నోరుపెట్టి 'కూ' అని గట్టిగా పిలవేశాడు.

ఆమె ఉలిక్కిపడి చెవి నులుపుకుంటూ "అబ్బా! ఎవరది?" అని పక్కకు తిరిగి చూచింది. ప్రబోధ్ నవ్వుతూ నిలబడ్డాడు.

"చాల్లే! కోతిలాగ."

ఆమెకు కోపం వచ్చినకొద్దీ అతడు విరగబడి నవ్వడం ప్రారంభించాడు. అతడు నవ్వినకొద్దీ ఆమె కోపం మిన్నులు ముడుతూఉంది.

ప్రభూ! నాకు మహా కోపం వస్తూంది. ఊరుకో... ఆఁ ఊరుకోపోతే చూచుకో...

"మణీ! నీకు ఎంతకోపం వస్తే నాకు అంత సరదా!"

"ఏం!"

"కోపాన్ని కందిన నీముఖం- ఎరుపెక్కిన నీకనులు, లేతగులాబీ రేకుల్లా కదిలే నీపెదవులు, ఎంత బాగుంటాయనుకున్నావ్!"

"చాల్లే."

ఆమె ముఖం పక్కకు తిప్పింది.

అతనుకూడా నెమ్మదిగా చెట్టెక్కి ఆమె కొమ్మపైనే, ఆమె పక్కనే కూర్చున్నాడు. ఆమెమాట్లాడలేదు. ముఖం చిట్లిస్తూ కూర్చుంది.

అతగాడు నెమ్మదిగా ఇలా ప్రారంభించాడు.

గీతం :—

"కోపాన నీముఖము
కుంచుకొని పోతేను,
తాపాన నాముఖము
వంచుకొని ఉండాలి...

పగలెల్ల నీకళ్ళ
నిగనిగలు దాచినా,
కలలలో నీకళ్ళు
కదలు చెప్పక మానునా!

పాట పాటకు తీపి
పండించుకొను పికము,
మాట లాడక ఏల
మౌన ముద్రను దాల్చు?

నవ్వు పెదవుల దాటి
నా యెడద మీటకే,
కన్నీట నా బ్రతుకు
కరిగించి వేస్తావ!

"చెప్పు మణీ!"

"చాల్లె పాడాన్! ఈమాత్రం పాటలెవరికి రావను కున్నావు!"

"వస్తే నీవు పాడరాదూ!"

"ఎందుకు?"

"నీ ఆనందానికి; లేదా నా ఆనందానికి."

"అవసరం వచ్చినప్పుడు పాడతాలే."

"అందాక నిమలిలా ఆడతావా?"

"ఏం ఆట?"

"కోతి కొమ్మచ్చి"

"నీకా ఆటవచ్చు; నాకురాదుగా"

"ఏం!"

'నీవు కోతివిగనక వచ్చింది; నాకెలావస్తుంది!'

'అదా సంగతి!"

"చిత్రం"

ఆమె రొమ్ముమీదనుంచి ఒక్క దూకు దూకి లేడిపిల్లలా బెదురుతూ పరుగుపెట్టింది. అతడూరుకుంటాడా! వెన్నాడి ఆమె చేయిపట్టుకొని తీసుకొచ్చి తన పక్కనకూర్చోపెట్టుకున్నాడు.

ఇద్దరూ పొలంగట్టున కూర్చున్నారు. గట్టుపక్కనుంచి పోయే కాలవలో ఇద్దరు కాళ్ళూపుకుంటూ, చేల పక్కన మేసుకుంటూఉన్న ఆవుల్ని చూస్తూ ఉన్నారు.

'మణీ! రానురాను అల్లరిపిల్లనై పోతున్నావే.

"ఇంకా కావాలి ప్రభూ! అల్లరిలో ఆనందం మీ పట్నవాసం వాళ్ళకేం తెలుస్తుంది!"

'కాలేజీస్టూడెంట్లం మాకు తెలియకపోతే, ఈసృష్టిలో ఎవరికి తెలుస్తుంది!' 'విద్యార్థి రాజావిట సౌఖ్యభోగమూ!' అని ఊరకే అన్నారా!"

"చదువుకొనే వాళ్లకు జీవితంలో సరదా అనలు తెలీదనుకుంటా!'

'ఏం'

"పొద్దుటనుంచీ సాయంకాలం వరకూ స్కూళ్లోనే, ఆనాలుగు గోడలమధ్య ఖయిదీల్లా జీవితం గడిపే మీకు ఈ కొన్నచేలల్లోని సొగసు, ఆపంటకాలువ మలుపులోని వలపు

మధ్యమధ్య గొట్టిపొట్టేళ్ళలాగ తిరుక్కొచ్చే మబ్బులెందుకు, ఆపొదరిళ్ళ రొదలు, ఈచల్లగాలి సొదలు, ఆపాలపిట్టకథలు- ఎలా తెలుస్తాయోయ్ ప్రభూ!

అలా చూడు ఎదున్నపోతునెక్కి ఆకవతగాడెలా స్వారి చేస్తున్నాడో- ఇలాచూడు ఈసీతిలో రగిన ఎద్దుతోక పట్టుకొని ఆపాలేరు బుడతడెలా ఈదుతున్నాడో!

ఆచెరువుగట్టున చూడు చాకలివాళ్ళు ఆడా మగా అన కుండా అంతా కలిసి మెలిసి, ఒకేపాట పాడుకుంటూ ఎలా బట్టలుతుకు తున్నారో? చదువుకోనివాళ్ళు అంట్లుమురికైనా పోగొట్టి ప్రజాసేవ చేస్తున్నారు. చదువుకొన్న మీరు సం ఘంలో ఏమురికి పోగొట్టి మీరు ప్రజాసేవ చేస్తున్నారు!

ప్రభూ! పగలల్లా ఆకాలేజీ ఖయిదుల్లో మగ్గిన ఖయి దీలు మీరేం చేస్తారు! ఉసూరు మంటూ ఇళ్ళకిపోయి ఏదో కాస్త మేసి, మళ్ళీ నాలుగుగోడలుమధ్య లైట్లముందు సిద్ధం. కాలేకాలే కాష్టం ముందుండే పిశాచాలుగా మీకూ తేడా ఏమిటి? అవి పుర్రెల్లో నెత్తురుపట్టుకొని తాగుతాయ్; మీరు కప్పులో టీ పనికతాగుతారు. ఆతెల్లని పుర్రెలకూ మీ తెల్లని కప్పులకూ భేదం ఏమిటి! ఆఎర్రని నెత్తురుకూ- మీఎర్రని టీకి భేదం ఏముంది?

"మణీ! వాటికేం విజ్ఞానం ఉంటుంది! మేం చదువుకుం టున్నాం దేందుకు?

'ఏవ్వు.

'విజ్ఞానికి'

'అక్కడికి మాకు విజ్ఞానం లేనట్లు!' ఏం!

'చాకపోతే, సత్ప్రథమనంలేందే విజ్ఞానం ఎలాకలుగుతుంది? విజ్ఞానంలేకపోతే మానవు లెలాగౌతరు"

"గ్రంథాధం లేనివారికి విజ్ఞానం లేదా!"

"ఎలాగుంటుంది మణి! అందుకనే మహమ్మద్ మహాశయుడేమన్నాడు. "Learn from Craddle to Grave" అని అంటే ఉయ్యాలతొట్టెదగ్గరనుంచి చచ్చేవరకూ చదవమన్నాడు. అలాచదివినవాడే విజ్ఞానులౌ అవుతాం. లేకపోతే పశువులమే.

అలాగా? అయితే ప్రభూ! రామకృష్ణపరమహంస ఏం చదువుకొని మహాత్ముడయ్యాడు? ఆయనకు విజ్ఞానంలేదా? ఆయనంటి విజ్ఞాని మీరు చదువుకొన్న వాళ్ళల్లో ఒకరున్నాడా?

సిద్ధిబాబూ! చీకటి లోకాన్నంతా విజ్ఞానదీపికచే వెలిగించిన ఏసుక్రీస్తు ఏం చదివాడు? ఇప్పటికే బ్రతికుండి ప్రపంచానికి దివ్యసందేశం పంపించే శ్రీ రమణమహర్షి ఏం చదివాడు? తత్త్వజ్ఞాని అయిన నాగమహాశయుడేమిచదివాడు? ఇలా లక్షోపలక్షలు చూపించగలను ప్రభూ!

ఆబాల గోపాలానికి యదార్థ ప్రపంచకాని ముసుగు తీసి చూపించిన వేమనయోగి యేం చదువుకున్నాడు? ఆంధ్రులనుంచి అరవలవరకూ ఇంటింట అన్నృతగీతాల నాలాపన చేయించే భక్త త్యాగయ్య ఏం చదువుకున్నాడు?

అలా వెఱ్ఱిగా చూస్తావేం! చెప్పు జవాబు!

"అలాగే. మరి చదవాలంటారే!"

"చదవటం అంటే- వ్రాసిన గ్రంథాలు చదవటం కాదు. అది సామాన్యం. చదవవలసింది పుస్తకాలు కాదు ప్రభూ! మానవహృదయాలు. అదే మహాత్ముని ఉద్దేశం."

అయితే ఈ కాలేజీ చదువు అవసరం లేదంటావా?

అవసరగ లేదనను. తప్పక కావాలి. కాని ఆ చదువు కంటే ప్రకృతి పాఠశాలలో చదువుకొనే చదువు చాలా గొప్పదని నా నమ్మకం.

ప్రభూ! గాంధీ మహాశయుడన్నట్లు, నేటి ఆంగ్లేయ విద్యావిధానం ఏ విద్యార్థిని మహర్షిని చేసిందని—? ఎంతమంది శివాజీ, రాణాప్రతాప్, కృష్ణదేవరాయలను తయారుచేసిం ది? షాజహాన్‌వంటి ఏకైక ప్రేమమూర్తిని ఒక్కని తయారు చేయగలిగిందా? బుద్ధునివంటి మహాత్యాగ మూర్తిని ఒక్కని లోకానికి ఇవ్వగలిగిందా? వాల్మీకివంటి సౌందర్యనిధిని దేశానికి చూపించగలిగిందా? మన బాలచంద్రునివంటి భారత వీర ధీరకుమారుని సంఘానికి ప్రసాదించ గలిగిందా? మూడువందల సంవత్సరాలయ్యాయ్? మనకేం చేసింది–

"అయితే ఈ విద్య తప్పంటావా?"

"ఏ విద్యా తప్పుకాదు. కాని నేటి విద్యా విధానం మన అభ్యుదయానికి తోడ్పడలేదు; తోడ్పడబోదు. ఒంటి

కంటే సంఘాన్ని రెండోకన్ను కూడా లేకుండా గుడ్డిసంఘాన్ని చేస్తూంది.

ప్రభూ! విద్యావిధానం మారాలి. స్త్రీ పురుషులందరూ కలిసిమెలిసి భ్రాతృభావంతో సంచరించాలి. అందరూ ఆర్థిక సమత్వం కలిగి ఉండాలి.

ప్రభూ! ఏ నాడు మన దేశంలో ధనికులు దరిద్రులను కాల్చుకుతింటం మానతారో, ఏనాడు స్త్రీ పురుషులిద్దరూ ఆర్థిక స్థితిలో సమత్వాన్ని పొందుతారో, ఏనాడు దేశాభిమానం ప్రజలలో రేకెత్తుతుందో—ఆ నాడే మన సంఘం పశుత్వంనుండి మానవత్వంలోకి ప్రయాణం చేస్తుందనుకో. అంతవరకూ...చూడు... ఆ కాపు కట్టువానికున్నా స్వతంత్రభావాలుకూడా కలిగి ఉండవనుకో.

అలాగే. ఒప్పుకుంటా. అంచేతే ఖద్దరు బట్టలు వేసుడానికి కూడా కట్టవాళ్ళు జడుస్తూంటారు. గాంధీగారి పేరు క్లాసులో చెబుతేనే ఎక్కడ పని తీసివేస్తారో అని లెక్చర్లుంటే గాంధీగారి మాట వింటానికే భయపడుతూ స్టూడెంట్లున్నారు... అలా కాకుండా కాలేజిల్లోనే రాజకీయ వాతావరణం ఉంటే— ఈ నాటికూడా స్వాతంత్ర్యం రాకుండా ఉంటుందా?

ఉండ దుండదు—

మణీ!

ప్రభూ! ఒక్క మాట చెబుతాను విను మీవంటి బి. ఏలు నూటికిద్దరు లేరు. కాని మన హిందూదేశంలో నూటికి 70 మంది పల్లెటూరు ప్రజలే. ఇండియా ప్రధానంగా కర్షక దేశమేగాని శాస్త్ర దేశం కాదు. గోమాత—భూమాత మనకు ప్రధానం. అందుచేత ఈ పల్లెటూరు పూరుకొంపల్లోనుంచి విజ్ఞానజ్వాల బయలుదేరితేనే గాని పట్టణవాసులలో విజ్ఞానం ఎలుగలేదు— విజ్ఞానం బయలుదేరవలసింది పట్టణాల్లో కాదు; పల్లెల్లో. పల్లెల్లో బయలుదేరిన విజ్ఞానం సుస్థిరం. కారణం తెల్లకాగితాలవంటి వాళ్ళ హృదయాలపైన మీరే అక్షరాలు వ్రాసినా అవి సుస్పష్టంగా ఉంటాయ్.

శభాష్ మణీ! బాగా చెప్పావ్! అందుచేత గాంధీజీ విద్యార్థులను సెలవల్లోనైనా పల్లెటూళ్ళు వెళ్ళి ప్రజలకు రాజకీయ, మత, సాంఘిక, సారస్వత విషయాలు ప్రబోధించాలన్నారు.

ఆయన అన్నారు; మీరు విన్నారు. క్రియ శూన్యం. ఇదే నేటి విద్యార్థుల కర్తవ్యం—

నిజమే. ఎంతసేపూ ఆడిగ్రీ కాస్తా సంపాదించుకొని, బయట పని, ఉద్యోగం సంపాదించుకొని, వేలకువేలు గడించి మేడలుకట్టేద్దామని, నాలుగుసార్లు పేపర్లులో పడి పేరు సంపాదించాలనే కాని మరొక గొడవలేదు.

అంటే రాను రాను భావాలు కల్బడుతూన్నాయ్ అన్నమాట.

తప్పకుండా.

అయితే కాస్త తోడుమజ్జిగ వేయండి. పాలు బాగా తోడుకుంటాయ్.

చిత్తం. ఏంచెప్పినా చెయ్యాలి. తప్పుతుందా! పల్లెటూరు పడుచులు.

అలాగే అండీ గ్రా స్త్రీశాస్త్రాళ్ళు.

ఇద్దరూ నవ్వుకుంటూ లేచారు. ఇంటి ముఖంపట్టారు.

"మణమ్మా! నీమాటలలో ఇంతి ఆటుపోటుంటుందే.'

'కొత్త పరిచాహంలే.'

"ఎలాగైనా నీవీపల్లెటూరిలో [illegible] ఈపల్లెటూరు వారు చేసుకొన్నా నోముఫలితం"

'తమరుండడంకాదు.'

"నాదేముంది- బాసిసబ్రతుకు.'

"ఎవరిదైనా అంతే—

ప్రభూ! మనపూర్వ్యులింత వాళ్ళంతవా ళ్ళనుకొనేదాని కంటేమనం అలా అవడం మంచిది... అందుకనే మహాకవి గురజాడ అప్పారావుగారన్నారు.

'వెనక చూచిన కార్యమేమోయ్,
మంచిగతమున కొంచమేనోయ్.
మందగించక "ముందు అడుగేయ్;
వెనకపడితే వెనకేనోయ్—"

"బాగా అన్నారు.
'అంచేత 'ముందడుగు" వేయ్'
'ఇద్దరం కలిసి వేద్దాం'
'అలాగే—"
నవ్వుకుంటూ వెళ్ళిపోయ్యారు ముందడుగు వెయ్యాలని'

---

# iv

గోమాతను, భూమాతను కొలుస్తూ వాటికొలువులో గల నిర్మలత్వాన్ని చాటుతూంది మణమ్మ. తండ్రిపోయాడని దిగులుపడిపోకుండా కుటుంబభారం అంతా ఒంటరిగా చిరునవ్వుతో భరిస్తుంది.

ఎందరో పుట్టుమొదటినుంచీ కష్టాల సంఘర్షణంలో ఆమెకన్నా సరదా, సుఖాలనుభవించడంలో లేదు.

నడుంకట్టి నలుగురి సహాయంతో తనకున్నా నాలుగెకరాలూ సాగునాగుచేసుకుంటూంది. తనకున్నా నాలుగు పశువుల్నీ తానే చూసుకుంటూఉంది.

ఖాళీగా ఉన్న కాలంలో ఏ రాట్నమో వడుకుంటూ పిల్లలకు పాఠాలు చెబుతూ, స్త్రీలకు రాజకీయ జ్ఞాన సరితో

ధాలు చేస్తూ ఉంటుంది. గాంధీగారు చెప్పినట్లు "సోమరుల కీప్రపంచంలో స్థానంలేదు' అని చెబుతూ ఉంటుంది. కబుర్ల లో కాలం గడపడం అంటే ఆమెకుమంట ఇది మె ప్రవృత్తి.

◆ ◆ ◆ ◆

ఉదయం ఆరుగంటలయింది.

చలికాలం అని గొంగలి ముసుకుపెట్టి,కడుపులో కాళ్ళు పెట్టుకొని పొద్దెక్కినా సోమరుల్లా లేవకుండా- ఉదయానే లేచి సూర్యోదయానికి పూర్వమే ఇటిపనులన్నీ చేసుకొం టుంది. అది ఆమె అలవాటు.

సంక్రాంతి పండగల్లో చక్కని: ముగ్గులుపెడుతూ, నిద రపోయే నలుగురు ఆడవాళ్ళను లేపి, ఆనందంగా పాటలు పా డుకుంటూ పనులుచేసుకుంటూ ఉంటుంది.

◆ ◆ ◆ ◆

అవును చిట్టూతెవుడూపెట్టి, పాలుపిదుకుతూ, పాడు కుంటూఉంది. ఆమె ప్రక్కనేవచ్చి కూర్చున్నాడు సుబ్బయ్య ఆమె సుబ్బయ్యను చూచింది.

'ఏవోయ్! సుబ్బయ్య!'

'అబ్బా! మళ్ళీ సుబ్బయ్యే అంటున్నావు'

'మరి ఏమనాలి'

'నోరారా ఒకసారి 'బావా!' అంటే—ఉబ్బితుకంతా పంచదార పాకం అయిపోదూ!" అతని అమాయకత్వానికి ఆమె పకృమని నవ్వింది.

'అయితే సరే నే.'

'మరి 'బావా!' అని పిలుపు ఒకసారైనా?

ఒకసారికాదు; వేయిసార్లు పిలుస్తా.

ఊఁ కానియ్.

బావా, బావా; బావా; బావా!

చాల్లెమ్మ. ఎక్కాల్లాగ అప్పచెప్పకునా-

అప్పుడప్పుడు సరదాగా మాట్లాడుతూఉంటే అలా మాట్లాడుతూ, మధ్యమధ్య 'బావా! ఏమిటోయ్, సంగతులు మనం ఇకముందు ఎలాగుండాలి? అని భార్యభర్తలలాఅడుగుతుంది. అలా అడగాలి.

ఓహూ, అదా నీవేషం.

కోంపడుకు.

కోపంలేదులే లేవోయ్ బావా; నాముద్దులబావా'

అతడ్ని వెల్లకిలాతోసివేసి నవ్వుతూ పాలచెంబు తీసుకొని ఇంట్లోకి వెళ్ళింది.

అతగాడు నెమ్మదిగా నవ్వు దాచుకుంటూ ఇంట్లోకి వెళ్లాడు.

మణీ ఏం అల్లరిపిల్లవై పోయావు?

బావా, ఏం అల్లరిపిల్లవాడవై పోతున్నావు"

'పడతా వచ్చుకొని కుర్రాడ్ని చేసి, అలా ఎలకతలా పడిపోయేటట్లు తోసివేశావే, నేనే నిన్నలా తోసేస్తే."

"పళ్ళురాలగొట్టేయనా!"

'అంతపనే'

"కాకపోతే నీలా గాజులు తొడిగించుకొన్నానా!!

"అదేమిటి? నేనేం ఆడదాన్ననుకున్నావా?'

'అంతకంటే అన్యాయం"

"ఏం"

"కాకపోతే నీవు ఏ దేశసేవలో నీనెత్తుటిబిందువను ఎండకట్టుతున్నావ్. ఏ ప్రజాభ్యుదయానికి నీశక్తినిధారపోస్తున్నావు ఇంట్లో ముండలాగాకూర్చొని కబుర్లుచెబుతున్నావు ఎంతసేపూ ఆఆడదానివెనకా, ఈఆడదానివెనకా, ఏదోయిన ఆంబోతులాతిరక్కపోతే ప్రజాసేవ చేయరాదూ, అయినా నీపాలం. అయినా దున్నుకుంటూరాని నీవు, నీపొట్టకు కావలసిన భిక్షం అయినా ముష్టెత్తుకుంటంరాని నీవు—ఛీ-ఛీ-నీవూ ఒక మనిషివేనా-

తాతముత్తాతలు గడించిన ఆస్తిమీద ఆధారపడి, తేర తిండి తింటూ పొట్టపెంచుకొని, పందుంగా పెరిగే సోమాంబోతులకూడా ఈసృష్టిలో విలువుంటుందీ!"

"మణీ!"

"మగవాడైపుట్టాక ప్రపంచవిషయాలు తెలుసుకోవాలి; ప్రజాసేవ చేయాలి...తనరెక్కలమీద తాను బ్రతకాలి; పదిమందిని బ్రతికించాలి...తాను ఆత్మస్వాతంత్ర్యం

గురించి, దేశస్వాతంత్ర్యం గురించీ పోరాడాలి; పరిమందిని పోరాడేటట్లు చెయ్యాలి. అప్పుడే మగతనం—అంతవరకూ ఆడదానికంటే కనిష్టమే.”

ఆ మాటలతో అతని ముఖం పొయ్యిలో పెట్టిన చిలగడ దుంపలా మాడిపోయింది. లోలోపలే మెత్తగా ఉడికిపోయాడు. ఆమె ప్రబోధాన్ని ప్రేమించడంచేత తనపంగా నిరసిస్తుందనుకున్నాడు. ఉన్నవిషయాన్ని అడిగి చేయాలనుకున్నాడు.

నాలుగు నిముషాలైనా మాట్లాడుకోలేదు. గొంతుక సవరించుకొని సుబ్రహ్మణ్యం ఇలా ప్రారంభించాడు.

“మణెమ్మా!”

“ఏం.”

“ఒక్క విషయం అడగాలని ఉంది అడగనా?”

‘తప్పక”

“ఆడవాళ్ళకి అసమర్థులపై ప్రేముండదు కదూ.”

“ఉండదు.’

“సమర్థులపై ఉంటుంది కదూ.”

‘ఉంటుందనేగా దాని అర్థం.’

“కోపపడకు. అయితే నామీద ప్రేమలేదా.’

‘లేకే—ఉంది.’

“మరి ప్రబోధుని ప్రేమిస్తున్నట్లున్నావే’

‘నిన్ను ప్రేమిస్తున్నట్లే అతణ్ణీ ప్రేమిస్తున్నా...నిన్ను

పేమిస్తే అతడ్ని పేమించకూడదని ఏమైనా ఉందా!'

'ఆహాఁ పేమించను నద్దను. కాని పెళ్ళిచేసుకొంటం అతడ్నా, నన్నా అని నా సంశయం.'

'సంశయం యేమీ అవసరంలేదు. ఇద్దర్నీ పెళ్ళిచేసుకోను.'

'మరి ఎవర్ని చేసుకుంటావ్!'

'ఎవర్నీ చేసుకుంటా! ఎవర్నీ చేసుకోను.'

'మరెలా'

'ఎలా గేమిటి! పుట్టినప్రతివ్యక్తి పెళ్ళిచేసుకోవాలన్న మాట—ఈదరిద్ర భారతదేశానికి మరికొందరు దరిద్ర భారత జీవచ్ఛవాలను కనాలా! గాంధీజీచెప్పినట్లు యావత్ కాలం బ్రహ్మచర్యంచేసి దేశసేవలో మనప్రాణప్రాణాలను రాలిపోనీయరాదూ, ఏం."

'అమ్మో! చచ్చేవరకూ బ్రహ్మచర్యమే.'

"పోనీ—నీవంటి పిరికివాళ్లు బ్రహ్మచర్యం చేయకండి. ఎవరు చెప్పేమన్నారు 'లోకో భిన్నరుచి'—ఎవరిష్టంవారిది 'యథామతా తథా కథా'—ఎవరిమతాన్ని అనుసరించే వారిమార్గం నీవుచేసేసేవనిబట్టి నీకొచ్చేఫలితం. బుద్ధినిబట్టి పద్ధతి. మనసునుబట్టి మార్గం యేమంటావు'

'నామనాలో తెలియదంటాను"

'యేమిటోయ్ తెలుస్తుంది,"

ఆమాట అంటూ పరిబోధ్ గుమ్మం ఎక్కాడు. ప్రబోధిని చూడగానే అతని మనసు చివుక్కుమంది— 'పానకం పుడకలా వీడు తయారయ్యాడేగా!' అనుకుంటూ "తెలిసిందొకటుంది కాబట్టి, ఇది తెలియలేదని చెప్పా." అని పరిభుతో అంటూ,

మణమ్మా వెళ్ళొస్తా మధ్యనేనెందుకు; ఏదో దయుంటే మీ బావను మరచిపోకు. అని మణితో చెప్పి బిక్కముఖంతో చక్కాబోయ్యాడు.

మణమ్మా; వాడెవరికి బావ-

నాకు.

ఓహో; వాడి మరదల వన్నమాట.

చిత్తం.

మరినాకో.

నీకా...నీ కేలాగనుకుంటే అలా.

చెల్లెలనుకుంటే అవుతావా!

తప్పక—

మరదలనుకుంటే—

'అలాగ్గా అవుతాను'

'భార్యననుకుంటే—'

'ఎన్నటికీ కాను.'

'కావ్.'"

'కాను; ముమ్మాటికీ కాను"

'మరి వాడి కపుకావా!'

'ఎవ్వరికీ కాను.

'సన్యాసివై మఠాలలో కలుస్తావా"

'చూస్తావుగా"

అగశాం నిట్టూర్పు విడిచాడు. సిగరెట్ తీసి మళ్ళీ ముట్టించాడు. పొగలు కక్కి, ఆలోచిస్తూ కొంత మిల్లు చేస్తున్నాడు.

"ప్రభూ! అలాపోదాంపద.'

'తోటలోకి పోదామా!'

"ఎక్కడికో - బాకులు దేరు"

'అక్కడ్నుంచి కలిసి బయలుదేరారు. అలా యువతీ యువకులు కలసి షికారుగా పోతలుదేరడం, అప్పట్లోటూకూకే కాదు; ఎప్పట్లోటూకైనా, వింతే. నలుగురూ నిలబడి వారి వంక వింతగానూ, వెకిలిగానూ చూస్తూ ఉన్నారు. ప్రభువుకు వళ్లుమండింది.

మణీ! ఎలా చూస్తున్నారో చూడు పశువుల్లాగ.

దానికే మిన్లే.

నాన్సెన్స్

'ప్రభూ! క్రొత్తొకవింత, పాతొకరోత' అన్నట్లు క్రొత్త దని ఏదైనా లోకానికి వింతగానే ఉంటుంది దానికి క్రీకు రోతగానే ఉంటుంది. కారణం నీకిది పాత! వాళ్లకిది క్రొత్త.'

సమర్థించడంలో నీ తరువాతే లే.

అదైనా ఉండొద్దూ.

ఇద్దరూ కలిసి కొంతదూరం వెళ్ళారు. అంతలో ఆ గ్రామానికి అధికారైన జమీందార్ కొడుకు వీరభద్రరావు గుర్రంమీద స్వారీచేస్తూ వస్తున్నాడు.

భద్రానికి మణిఅన్నంటే పంచ ప్రాణాలు. అతడూ ప్రబోధ్ 'క్లాసుమేట్లు' ఇద్దరూ ఒకేసారి బి. ఏ. ప్యాస య్యారు. ఇద్దరూ మణిని ప్రేమించారు; పెళ్ళి చేసుకుందా మని నిశ్చయించుకున్నారు. ఆ సంగతి వారు వారి నౌకరితో చెప్పుకున్నారు. నాటినుంచీ లోలోన గోతులు తవ్వుకుంటూ ఉన్నారు.

భద్రం బలవంతంగానైనా మణిని పెళ్ళిచేసుకుందా మనుకున్నాడు. ప్రబోధ్ మణి చెప్పిందానికల్లా తలూపి, ఆమెను మెప్పించి పెళ్ళిచేసుకుందామనుకుంటున్నాడు... కేవ లం మణి సేవచేసి, పూజించి పెళ్ళిచేసుకుందామనుకున్నాడు సుబ్బయ్య.

ముగ్గురితోటీ ఆశ్రయం ఇచ్చి మాట్లాడుతూంది. తీయతేనెలు వర్షిస్తుంది. కాని ముగ్గుర్లో ఎవర్నీ పెళ్ళిచేసుకో నని విస్పష్టంగా చెబుతూంది. చెప్పినా వారామెను విడిచి ఉండడంలేదు.

వాళ్ళేకాదు ఆ పల్లెలో ఆమెను చూచిన ప్రతి యువ

కుమా ఆమెను పెళ్ళిచేసుకోవాలనే దేవుని మొక్కుతూ ఉన్నాడు.

ఇంతమందిని వెఱ్ఱెత్తించిన ఆమె ఏమైనా భూలోక సుందరా? కాదు. చామనచాయ. సన్నని శరీరం. అయిన ప్పుడు ఇంతమంది మోహించడానికి కారణం ఏమిటంటే—ఆమె యౌవ్వనబింకం; మాట పొంకం; చురుకు చూపు; వలపు నడక—అన్నిటికంటే ప్రధానం ఆమె నిష్కల్మషహృదయం, తీర్చిదిద్దిన శరీర లావణ్యాం.

కనుమేర దూరాన్నుంచీ మణిని చూశాడు భద్రిం. అతని గొప్పతనం అంతా ఆమె ముందే ప్రదర్శించాలను కున్నాడు. దానితో ఎక్కడలేని శీవి—ఎక్కడలేని మదం— ఆవేశించాయ్. తోవమూర్గం లేదు. దృష్టిఅంతా మణి మీదే...శరవేగంగా వస్తూన్నాడు.

మణి ప్రభులు చూశారు.

చూశావ్ మణీ!

చూడకే—అతని గర్వం కన్నులు వస్తూంది. దారి కనబడడంలేదు,

ఇదంతా ఎందుకో తెలుసా?

తెలియకేం?

నీ ముందాతని ప్రజ్ఞ చూపాలని...

కాదు; ప్రిశాల గుండెలమీద ముందెలా కదనులో శ్కాలో ఇప్పటినుంచీ నేర్చుకుంటున్నాడు.

బాగా గ్రహించావ్

అతడా మాట అంటూనే ఉండగా భరద్వాం "మణీ! మణీ!" అంటూ వచ్చేస్తూఉన్నాడు. అంతే "అమ్మో! అనే పెద్ద కేక వేసింది మణి.

ఒక ముసలమ్మ గుండెమీదుంది గుఱ్ఱం కాలి డెక్క. ముసలమ్మ గోల్లుమంది. గుఱ్ఱం ఆమె గుండెమీద ఒక్క సెకను కదనతొక్కింది. అంతే. ఆవేదంటింది. వెంటనే గుఱ్ఱంమీదనుంచి భద్రం ఒక్క దూకు దూకేశాడు. వెంటనే గుఱ్ఱం కళ్ళెం సాహసించి పట్టుకున్నాడు. గుఱ్ఱం ఆగిపోయింది. లాభం ఏముంది? ముసలమ్మ గుండెలనుండి చిమ్మిన నెత్తుటిజల్లు వెల్లవేసింది కక్కడ. ఆ దృశ్యాన్ని చూచి అందరికళ్ళూ చెదిరిపోయాయ్.

వెంటనే "అవ్వా!" అని పెద్ద కేకవేసి అవ్వమీద వాలిపోయింది మణి. అవ్వ ప్రాణాలు పోయాయేమోనని చూసింది. కాని అవ్వప్రాణాలు పోలేదు. గాయంతగిలింది. నెత్తురు జిమ్మింది.

మణికి కోపం ఆగలేదు. ఆమెను తనరెండుచేతులతో పైకి లేవలేవదీసింది. జనం అంతా రెండునిముషాల్లో 'హాహా' రవాలుచేస్తూ ఆమెచుట్టూ జేరారు.

మణి ముసలమ్మను తనభుజంమీద వేసుకుంది. ఆమె భుజం అంతా నెత్తుటితో తడిసిపోయింది.

భద్రం! జమీందారు బిడ్డవు కదూ! అంటేనే భూమి మీద కాకుండా మానవహృదయాలమీద కదనుతొక్కిస్తున్నావ్ నీగుర్రాన్ని. తండ్రినిబట్టే కొడుకు...భద్రం నేనెవరకూ మా చెమటతో పెంచిన పంట కాజేసి మమ్మల్ని ఫకీరులను చేస్తున్నారు. అది చాలక మా నెత్తురు మీ పాదాలకు చాలక మీ గుర్రపు పాదాలకూ కూడా, పారాయణ పూతలనుకుంటున్నారా? అలాగే కానీయండి ఆ గుర్రపుగిట్ట లెంత మంది నెత్తుటితో తడిసినవో. ఎంతమంది నెత్తురాగిట్టలనంటి ఎండిపోయినవో. దానిలో మా అవ్వనెత్తురు బొట్టు ఏమూలో భద్రం? జమీందారు బిడ్డవుగదూ నీవు.

ఆమె కన్నులలా జ్యోతుల్లా వెలిగిపోతున్నాయ్. 'తానొకటితలుస్తే దైవమొకటి తలచాడు" అన్నట్లు, ఏమణి మెప్పుపొందాలని తాను క్రిందామీదా చూచుకోకుండా గుర్రాన్ని కదను తొక్కించాడో, ఆమణికే చెప్పలేనంత ఆగ్రహం కలిగించాడు. గజగజా వణికిపోయాడు.

"మణమ్మా! తప్పుచేశా క్షమించు."

"నిన్ను క్షమించినా శిక్షించినా మాఅవ్వ ప్రాణాలు నిలబడతాయా భద్రం."

"మీఅవ్వప్రాణానికి నాప్రాణం అడ్డువేస్తా ఆమెకు వచ్చిన ప్రాణభయంలేదు. రాజవైద్యునితో గాయం బాగు చేయిస్తా. ఆమె జన్మజన్మకీ కష్టపడకుండా పదిఎకరాల మా

గాణీ రాయిస్తా. నాలుగు వేల రూపాయలు జీవితానికిస్తా. ఇంకా నీవేది చెబుతే అది చేస్తా — —"

"అయితే మొదలీమెను బండిమీద తీసుకువెళ్ళి రాజ వైద్యులకు చూపించు"

"అలాగే'

అంతా మెను బండిలో వేసకొని ప్రిభుసహాయంతో ఇంటికి తీసుకువెళ్ళారు — ఏవిటో వెధవ మోహం ఎన్ని దుర్గతులకు తీసుకొని పోతుందో చూడండి.



## V

ఆ ఊరు కమ్యూనిస్టులు కొంతమంది రాజకీయప్రబోధాలు చేయాలని వచ్చారు రాత్రి 9 గంటలకు మంటపం దగ్గఱ సభ ఏర్పరిచారు.

వారు ఉపన్యాసాలు ప్రారంభించారు. రైతులను రక్త పూరితులను జేస్తున్నారు. మణిక్ దేశికం చెప్పడానికి వీలు లేదు. వారితో కలిసి దేశసేవచేస్తే బాగుండునా అనిపించిం దామెకు అక్షణంలో.

ఆ ఉపన్యాసకులలో బహు అందగాడు— చురుకు చూపువాడు—ఘాటుమాటవాడు— ఈటులేసి పోటుబంట్లు

అమరేంద్రనే వాడు ఉపన్యాసవేదికపై నిలబడ్డాడు. అతణ్ని చూచిందో లేదో మణిహృదయం పున్నమినాటి వెన్నెలలా వెల్లివిరిసి పోయింది. వెనుక నిలబడింది. నలుగుర్నీ తోసుకొని ముందుకొచ్చి నిలబడింది— —అంతట్లో ఊరుకోక ఆవేశపడ్డట్లే ఆతనిదగ్గరే కూర్చుంది. అతడామె శరీరస్పర్శకు లోలోన విరగబూచాడు. ఆతని శాంతాకారానికి ఆమె లోలోన నమస్సు లర్పించింది. ఇద్దరిభావాలూ ఒక్కటే కాబట్టి, ఇద్దరి హృదయాలూ ఒక్కటే అయ్యాయే...

అతనుపన్యాసం ఇలా ప్రారంభించాడు.

“ప్రియతములారా!

నేను నేను చెప్పేమాటలన్నీ మీకు విరుద్ధాలుగా ఉండొచ్చు. కాని కాలంగడచినకొద్దీ ఆలోచించుకొంటే అవి విరుద్ధాలుగా కనిపించవు. యథార్థాలుగా కనుపిస్తాయ్.

ఏ దేశం శాంతి, స్వాతంత్ర్య, అభ్యుదయాలపై [పీస్ ఫ్రీడమ్–ప్రోగ్రెస్] ఆధారపడిఉంటుందో, ఆ దేశంలో కష్టజీవుల కన్నీళ్లు రావు. పతిత మానవజీవితబాధాగాధలు బయలుదేరవు. ఒకపురుషుడు మరొకపురుషుని నెత్తురుపిండి, కాసులు పండించలేడు. ఒకపురుషుడు మరొక స్త్రీ కన్నులు పెకిలించి అంధురాలను చేయలేడు.

ఆకలిదప్పులతో ఒకడు అలమటిస్తూ ప్రాణాలు విడుస్తూఉంటే ఆప్రక్కనే మరొకడు కోటికి పడగెత్తలేడు.

కరువు కాటకాలు, ఈతిబాధలు ఆదేశంలో కాలు మోపవు. ప్రజాపరిపీడనానికి అక్కడ తావులేదు.

రాజకీయ, మత, సాంస్కృతిక, సాంఘిక పరిస్థితులు తెలియని ప్రజలు అజ్ఞానులై పశువుల్లా బ్రతుకమంటే—కవులు కావ్యప్రబోధాత్మకమైన కావ్యాలు వ్రాశారు. ప్రజాభ్యుదయానికి తోడ్పడని చెత్త తోత్తు పచ్చిశృంగారపు కావ్యాలు వ్రాసి, ప్రజలను తప్పుడు పథంలో నడిపించరు.

శాంతి, స్వతంత్రాభ్యుదయాలకు ఆలవాలమైన రాజ్యం రామరాజ్యమే — — అట్టి రామరాజ్యానికి మీరు పౌరులు కావాలి, స్వాతంత్ర్యపతాకం ఇంటింటా ఎగిరించాలి, స్వాతంత్ర్యశంఖం ఇంటింటా పూరించాలి. అభ్యుదయపథంలో ఆ విజ్ఞానలతలను పూయించాలి. అందాక మనం మానవులం కాదు, పశువులం, స్వార్థపిశాచులం, భూలోకరాక్షసులం, కదిలే శవాలం, పూడ్చబడ్డ సమాధులం, కాలేకాష్ఠాలం—తెలిసిందా!

బాబూ!

యావత్ భారతదేశానికి మీరే వెన్నెముక; మీరే ప్రాణం; మీరే జీవం; మీరే సర్వస్వం. మీరు పండించిన పంటలేకపోతే పట్నాల్లో తిండిలేక చచ్చినవారి శవాలను

శ్మశానంవరకూ ఈడ్చుకుపోయే మనుషులే ఉందరు- ప్రతి పూటా వారుతినే అన్నం మీరుచెమటూడ్చి, కష్టించి, పండించే పంటే. మీరు కోటాను కోట్ల భారతీయులను పోషిస్తున్నారు. కాని మీరేమిమ్మల్ని పోషించుకో లేకపోతున్నారు.

చూచారా ఎంత ఘోరమో! ఎంత అక్రమమో! ఎంత అన్యాయమో!

మీరు ఇతరులకు మూడుపూటలా తిండిపెడుతున్నారు; కాని మీకు రెండుపూటలుకూడా కడుపునిండా తిండిలేదు... మీరు దేశానికి బట్టనిస్తున్నారు; కాని మీకు కట్టుకుంటానికి ఒంటినిండాబట్టలేదు.

దీనికి కారణం ఎన్నడైనా ఆలోచించారా? ఒక పేద రైతు ఎన్నడైనా లక్షాధికారి కాగలుగుతున్నాడా? లేదే-

చూడండి మీలో ఎందరికి కప్పుకుంటానికయినా బట్టలులేవో. ఎందరికి తిండిలేక బక్క-చిక్కి-పోయారో

దీనికి కారణం "ఇది' అనిఎవ్వరైనా చెప్పారా? లేదు. చెప్పరు. చెబితే మీరు బాగుపడితే వారు మేడలెలా కడతారు.

బాబూ! కారణం చెబుతా వినండి—

ఈకట్టినేలను నాగలి మొనతో మీ పేరునాటి, మీ చెమటపోసి దున్నుతున్నారు. మీకన్నిటితో గింజలు నాటుతున్నారు. వంగిపోయిబయటకనపడే మీగుండెమీద ఎము

కవంటి కొడవళ్లతో కోస్తున్నారు. ఎడ్లతో తొక్కించి గింజ రాల్పిస్తున్నారు. ఆగింజలు బస్తాలకు ఎత్తుతున్నారు.

అదంతా మీ కష్టార్జితమే కదూ! కాని ఆ బస్తాలన్నీ మీ ఇళ్ళకు వస్తున్నాయా? లేదే—

ఏడూళ్లలోనూ ఉన్న భూమిగల పెద్దఆసామికి పంపిస్తున్నారు. అతడు రైతుకాదు: ఉత్త భూస్వామి. నిజానికి మీరే రైతులు. మిగిలిన బస్తాలు పన్నుక్రింద జమీందారులకు పంపుతున్నారు.

ఇంక ఎకరానికి మిగిలేవి ఏ ఒకటో, రెండో బస్తాలు గడ్డి— గడ్డిగోవులకు ఎడ్లకూ చాలదు; మిగిలిన ధాన్యం మీకూ మీపిల్లలకూ చాలదు.

దానితో మీ పశువులు బక్కచిక్కి ఎముకలగూళ్ల లాగ తయారౌతున్నాయ్; మీరో పస్తుపంజరాల్లాగ తయారౌతున్నారు. తెలిసిందా? ఇప్పటికైనా మిమ్మల్ని దోచేదొం గలెవరో తెలిసిందా?

కష్టపడడం మీవంతా-మీ కష్టాలవల్ల సుఖపడడం వారివంతా? ఎక్కడుంది న్యాయం. ఏమంటే—మీ కర్మం అంటారా!

మాటాడితే వాళ్ళని దేవుడు భాగ్యవంతులుగా పుట్టించాడు, మిమ్మల్ని దేవుడు పేదవాళ్ళుగా పుట్టించాడు. వారి కర్మది; మీ కర్మది; అంటారా? దేవుడెక్కడా పక్ష

పాతం అంటగడతారా? కన్నతల్లే పిల్లల్ని సమానంగా కంటుందే, భగవంతుడంతటివాడు మానవులనందర్నీ సమానంగా సృష్టించడా? యోచించండి.

ఇలాగే 1917 సంవత్సరంముందు రష్యాలో తిన తిండి లేక కొందరు చస్తూంటే, ఉన్న ధన ధాన్యాలు దాచుకోలేక మరికొందరు చచ్చేవారు. ఈ అన్యాయం చూచి, మార్క్సు, టాల్‌స్టాయ్, ఏంగిల్సు, లెనిన్, స్టాలిన్, గాంధీ, మాక్సిమ్ గోర్కీ, టర్జనోవా, డాస్టొవెస్కీ మొదలగు మహాత్ములు, రాజకీయ దురంధరులు ఆయా పరిజలలో విప్లవజ్వాలలు రేకెత్తించారు. దానితో దేశంలో విప్లవం చెలరేగింది. భాగ్యవంతుల భాగ్యం అంతా పరిభుత్వంలోకి వచ్చింది. అంతే, ఆనాటినుంచీ నేటివరకూ అక్కడ అన్నం కోసం ఆకలి లేదు.

1917 కు ముందు రష్యా పరిస్థితి నరకం; నేడు స్వర్గం. నాడు ఆకలి దప్పులున్నాయ్; నేడు లేవు. నాడు చదువుకోనివారున్నారు; నేడు లేరు. నాడు స్త్రీ స్వాతంత్ర్యం లేదు; నేడుంది. నాడు దరిద్రులూ ధనికులూ ఉన్నారు, నేడు లేరు.

దీనికి కారణం ఏమిటి? కర్మా? భగవల్లిఖితమా? కాదు—మానవ శాసనం. అది మరచిపోకండి. దేవుడొక్క-

కోణనవచ్చి భాగ్యవంతుల నొసటి రేఖలన్నీ చెరిపివేయలేదు. అలా చెరిపివేసింది ప్రభుత్వం.

మీ రెండుకీ భూ స్వాములకు-జమీందారులకు అంతంత డబ్బు ఇవ్వాలి. భూమి వారిదంటారా, సగం వారికి వ్వండి, సగం మీరు తీసుకోండి. అది మీరంతా ఒకటైతే సాధించగలరు...

వెనక వడకండి, 'ముందడుగు' వేయండి—అంటుంటే "వెనకవడం-ఎన్నటికీ వెనకపడం.ముందడుగు వేస్తాం. అంతా ఐక్యంగా పనిచేస్తాం. దేశ స్వాతంత్రం సంపాదిస్తాం. ప్రజాభ్యుదయానికి పాటుపడతాం. జై భారత మాతకుజై" అని మరమ్మలేచి ఉద్రిక్తంగా అతనికడ్డువచ్చి మాటలాడి, 'జై' అనే సరికంతా "జై జై" అంటూ లేచిపోయారు.

దానితో మునసబు, సుబ్బయ్యా, కరణం మొదలగు ప్రభుత్వాభిమానులు నానామాటలు వారికి వ్యతిరేకంగా అన్నారు. అక్కడనుంచీ తిట్లాటలు, పోట్లాటలోకి దిగాయ్. ప్రజలంతా చెల్లాచెదురైపోయారు. ఆడవారూ పిల్లలూ పారిపోయారు.

ప్రబోధానికి వచ్చిన కమ్యూనిష్టులు మరో గ్రామం వెళ్ళాలని స్టేషనుకు నడిచి వెళ్ళిపోయారు. కాని మన అమ

రేంద్రుడు మాత్రం కరణంతో పోదిస్తూ వారితో వెళ్ళలేక పోయాడు. ఆసంగతి మణమ్మకు తెలీదు.

◆ ◆ ◆ ◆

మణమ్మ ఇంటికివెళ్ళి భోంచెయ్యకుండా సావిట్లో కిటికీ దగ్గరకూర్చుని రోడ్డుమీద వెళ్ళే పోయే వాళ్ళను చూస్తూ ఉంది.

అమరేంద్రుడు ఎంత చదువుకున్నా వాడు. ఎంత చక్కగా చెప్పాడు. ఒకో పల్లెటూరుకు ఒకో అమరేంద్రుడైనా ఉంటే పల్లెలు విజ్ఞానులయ్యేవారుకదా!" అనుకుంటూ అమరేంద్రుని ప్రతిభను గురించి భావిస్తూ కూర్చుంది.

రాత్రి 10 గంటల సర అయింది.

పండు వెన్నల కనులపండువగా ఉంది.

అంతలో దోవతప్పిన అమరేంద్రుడా దోవన వెళుతూ ఉన్నాడు ఒంటరిగా ఆమె చూచింది. కొంతసేపు స్వప్నమా? సత్యమా? అని వ్యాకులత పడింది.

బయటకు వెళ్ళి చూసింది. ఇంకెవరు? తన ఆత్మీయ జీవన బాంధవుడు; అమరేంద్రుడే!

"అమరేంద్రా?"

అతడాగి చూచాడు.

"అమర్ !"

"ఎవరు? మణీ!"

నా పేరెలా తెలిసింది?

ఎవరో చెప్పారు—'నా తరువాత మాట్లాడిన ఉద్రిక్తమూర్తి ఎవరు?' అని అడిగితే సీసంగతి.

మంచిది. ఇలా ఎక్కడకు?

స్టేషనుకు.

మార్గం ఇటుకాదే-

మరి ఎటు?

నేను చూపిస్తాలే. రా—ఇలా రా!

ఎందుకు మణిమాలా!

భోంచేసి వెళుదువుగానిలే రా! అలసిపోయావ్.

ఆకలి లేదే.

నా విరాగడ పెరుగు చూస్తే ఆకలి పడుతుంది. లే. రా. రావోయ్! ప్రభూ జీవన దాతా!- అంటూ అతి స్వతంత్రంగా ఆయన చేయిపుచ్చుకొని లోపలకు తీసుకు వెళ్ళింది.

అమరేంద్రుడామె స్వతంత్ర జీవితాన్ని చూచి ఆశ్చర్యపోయాడు...

ఆమె పరుగు పరుగున లోపలకు వెళ్ళింది. వేడినీళ్ళు కాళ్లు కడుక్కొంటానికిచ్చింది. తువాలు పట్టుకుని నిలబడింది. అతడు ముఖం తుడుచుకుని ఆమె చూపిన నులకమంచంమీద కూర్చున్నాడు.

రాముని చూచిన శబరిలా, ఆ దేశభక్తుని చూసే సరికి ఆమె భక్తి పారవశ్యంలో మైమరచిపోయింది.

అతనికి చక్కని అరిటాకులో భోజనం వడ్డించింది. నెయ్యి కాసి గిన్నెలో పోసి పెట్టింది. మీగడ పెరుగు, ఊరగాయలూ పెట్టింది.

రావోయ్! అమరేందా! ఏందుకు రావోయ్ ఆత్మీంద్రా!

ఏమిటి? కవిత్వం కూడానా?

కళామూర్తివి, నిన్ను చూస్తే కవిత్వం రాకుండా ఉంటుందా?

మణమ్మా! నీవు భోంచేశావా?

లేదే.

మరి నాకొక్కడికే పెట్టావే?

మగవారు తిన్నా తరువాత ఆడవారు భోంచెయ్యడం ఆచారంగనుక.

అది నాటి ఆచారం, నేటి ఆచారం అంతా కలిసి భోంచెయ్యడమే నాడు సంఘంలో స్త్రీ పతిత; నేను స్వతంత్రురాలే నీవూ భోజనం పెట్టుకో. ఇద్దరం కలిసిభోంచేద్దాం.

"సరే. తప్పుతుందా? పతిభావులాజ్ఞ

ఆమె నవ్వుతూ వంటింట్లోకి వెళ్లి గిన్నెలో భోజనం పెట్టుకొని, కావలసినవన్నీ అక్కడే పెట్టి కూర్చుంది.

ఇద్దరూ ప్రారంభించారు భోజనం.

అతడు మొగమోటంపడి నెయ్యి కొద్దిగా వడ్డించు కున్నాడు. ఆమె నేతిగిన్నె అతని అన్నంపై దిమ్మరించింది.

'చంపేవ్ మణీ!'

"ఏం!"

'కమ్మని నెయ్యి తాగగానే సరికాదు; అయ్యేదాహం తీర్చాలి"

"దాహం తీర్చుకొనేశక్తి లేకపోతే ఇలాపడెయ్'

'చాల్లే. ఊరుకో. ఎంగిలికూడానా!'

"ఎంగిలి పరులకు- నాకేమిటి? అమర్? మనం అంతా ఒక్కకుటుంబానికి చెందిన వాళ్ళంకావోయ్, మనం సేవించే ది ఒక్కతల్లినేకదూ'

'కాదని ఎలాగంటాను? అంతా ఒక్కతల్లి బిడ్డలమే'

"మరింకే..."

"ఏమీలేదులే..."

'అమర్! ఇంకా ఎన్నిఊళ్ళు తిరగాలి'

'లెక్కలేదన్న'

మరినీతల్లి దండ్రులెలా ఊరుకున్నారు?

"ఊరుకోకేం? ఎవరికైనాకావలసింది. ప్రజాసేవేగా

"బాగు. బాగు. నీభార్య్ఎలా—"

'ఊరుకుంటానికసలు నాకు భార్యఏమిటి? పెళ్ళి చేసు కొంటే—'

"ఏమిటి? పెళ్లే చేసుకోలేదూ"

"ఎందుకమ్మా నీకా ఆశ్చర్యం! ఈబానిస దేశంలో పెళ్లిచేసుకోనేటంత దౌర్భాగ్యుడనంటావా? పెళ్లిచేసుకొని దరిద్ర ప్రజలకు మరికొందరం దరిద్రులను జతచేసే పాపం కట్టుకోనా?"

'అయితే పెళ్లిచేసికోవా"

'స్వతంత్రం లభించే వరకూ చేసుకోను'

'శబాష్! అమర్! నీవు నిజంగా అమరుడవే"

"ఇద్దరిభోజనాలు కావచ్చాయ్.

అమర్ - నాకెవ్వరూ లేరోయ్'

అవును. విన్నా.

"నన్ను నీతో తీసుకుపోరాదూ! నేనూ మీతో కలిసి ప్రజాసేవ చేసుకుంటా".

వద్దు మణమ్మా! వద్దు. నీ ఆశయానికి, నీ కర్మదీక్షకు నాకు చాలా ఆనందం. కాని నీవు ఈ ఊరిలోనే ఉండాలి.

ఏం?

ఉండి జమీందారు దౌర్జన్యం, భూ స్వాముల దౌర్జన్యం ఎదుర్కోవాలి. ప్రజలలో రాజకీయ వాతావరణం ఏర్పరచాలి. అది నీవిధి.

అలాగే.

భోజనాలయ్యాయ్. అతడు ఆమెదగ్గర సెలవుతీసు
8

కొని బయలుదేరాడు.

అమర్! వెళుతున్నావా?

తప్పుతుందా మణితల్లీ!

అమర్...

మణీ! స్టేషనుకు త్రోవెటు?

అటు-గమ్యస్థానం చేరడానికి మార్గం అటు. మార్గం కంటకావృతమైనదినుమా. త్రోవ పొడుగునా రాళ్ళగుట్టలు. ముళ్ళపొదలు. విష సర్పాలు. నీవు ఒంటివాడవు. ప్రయాణం చాలా దూరం చెయ్యాలి. జాగ్రత్తనుమా! కన్నుమూశావా అంటే కాలు ముళ్ళకంచిలో పడిపోతుంది. తలతిప్పావా అంటే పాము కాటువేస్తుంది. జాగ్రత్త.

అతడు చిరునవ్వు నవ్వాడు.

మణమ్మా! నీవు నిజంగా నాకంటే విజ్ఞానివి. ప్రతిమాటా భావగర్భంగా మాట్లాడగల ప్రజ్ఞాశీలివి. జీవయాత్రకూ, నా మార్గానికీ పోల్చి చాలా చక్కగా చెప్పావ్. నీకు నా ధన్యవాదాలు.

ఎంతమాట.

సెలవా?

మంచిది. అమర్! మళ్ళీ ఏ జీవన నదీతీరాన్నో కలుసుకుందాం. అందాక ఈ నీ చెల్లెల్ని మరచిపోరాదునుమా!

ఎన్నటికీ మరచిపోలేను చెల్లీ!

వెళ్ళి రా అమర్! అన్నా వెళ్ళిరా!

ఆమె కన్నీళ్లు జల జారిపోయాయ్. అతడు కన్నులు తుడుచుకుంటూ వెళ్లిపోయాడు.

ఆమె అతని పాదాలు మోపబడినచోట తలవంచి నమస్కరించి, కన్నులకద్దుకుంది.

ఇదంతా చూస్తూన్న ప్రభు ఆశ్చర్యపోయాడు.

మణమ్మా!

ఏం ప్రభూ!

ఏమిటీ తన్మయత్వం? ఎందుకలా నమస్కరిస్తున్నావ్!

ప్రభూ! అతడు నా దేవుడోయ్!

అదేమిటి?

నిజమైన దేశభక్తులందరూ నాకు దైవ స్వరూపులే.

వాడొక దొంగభక్తుడు కాకూడదు?

పిచ్చితండ్రీ! కాంతా, కాంచనములకు లొంగనివాడే దొంగభక్తుడైతే, ఇక నిజమైన భక్తుడెవ్వడు?

అతడలాగే నిలబడి పోయాడు,

ప్రభూ! అతనిలోని దేశభక్తి, ప్రజాసేవ, కార్యదీక్ష, ధర్మదీక్ష—నీకెన్ని జన్మలకు అలవడుతాయో! వెళ్లు... ఆయన పాదాలపైబడు...ఏమైనా మోక్షం వస్తుందేమో!

ఆమె మాట్లాడకుండా లోపలకు వెళ్లి "అమర్! నాలో అమరసంగీతాన్ని మేలుకొల్పి పోయావోయ్! ధన్యుడవు" అనుకుంటూ తలుపులు వేసుకుంది ప్రభు ఇంటిముఖం పట్టాడు.

అబ్బా! భక్తులకు ఆరాధ్య దేవతలు కనబడితే ఎంత ఆనందం!

—

## vi

ప్రదిహేను రోజులయింది.

మునసబు కరణాలు నలుగురు జమీందారు బంట్రోతు లతో పన్నువసూలు చేస్తున్నారు. పన్నులు ఇవ్వనివారి ఆస్తులు జప్తుచేసున్నారు. జమీందార్ కుమారుడు భద్రం ఆయేడు స్వయంగా వసూలు చేస్తున్నాడు. పూర్వపు బాకీ లన్నీ గట్టిగా వసూలు చేస్తూన్నాడు.

మణమ్మ ఇవ్వనన్నది. గంభీరంగా నిరాకరించింది. ఎట్టి కష్టాలకైనా సిద్ధపడతానుగాని పన్ను లీయనంది.

భద్రం ఒక్కడే ఆమె ఇంటిలోకి వెళ్ళాడు. నలుగురు బంట్రోతులూ బయటున్నారు.

మణమ్మా! నీవు రెండు పన్నులివ్వాలి సుమా!

ఏంపన్నులు?

ఇంటినేల పన్ను; పొలం పన్ను.

నేలపన్ను ఇవ్వాలా? ఎందుకు?

నేల మాదికాబట్టి.

పిచ్చితండ్రీ! నేల మీదెలాగయింది.

మాకు పెద్దలనాటినుంచీ వస్తూంది.

మీ పెద్దల నాటినుంచీ ఈ నేల ఇక్కడేఉంది. ఇది నీదికాదు; నాదీకాదు. అందరిదీను. అలాగే పొలంకూడా ఎవరు పండించుకుంటే వారిదే.

"అయితే ఈయవా!"

"ప్రాణంపోతే ఈయను.

"మణీ! చెడిపోతున్నావు! చెబుతున్నాను విను. నన్ను పెళ్లిచేసుకుంటే ఈ భూములన్నీ నీవే అవుతాయ్. లేకపోతే—

"నీవవుతావు. అంతేనా? భద్రం! ఈ బెదిరింపులవల్ల పూర్వంఉండే గౌరవ భావంకూడా పోయి, చులకన భావం ఏర్పడిందని మరచిపోకు'

'అలాగా...మణీ! నిన్నేంచేస్తానో చూచుకో.'

పిచ్చివాడా! బెదరించి నన్ను పెళ్లి చేసుకుందామనుకున్నావా? ప్రజల నెత్తురు పీల్చే నీవంటి స్వార్థపరులను, దేశ సేవ తెలియని మూర్ఖున్ని ఈ మణి వివాహం చేసుకోదనుకో. ఏ దేశసేవకుడో ఏ త్యాగమూర్తినో మణి సేవించగలదు. నీవంటివానిని—"

మణీ! నీయిల్లూ భూమీ తగల పెట్టేస్తా"

అంతేకాదు? నన్ను తగలపెట్టినా లెఖ్ఖచేయననుమా! నీలా పిరికిదానను కాను.

నీకు తలదాచుకుంటానికి స్థలం ఉండదు.సుమా!

ఆకాశంఅంతా నీదికాదుగా.

అయితే బయటకు వెళ్లు.

వెళుతున్నా.

ఆరేయ్! ఆపతువుల బంధాలు తెంచేయ్.

ఆమె బయటకు బయలు దేరింది. ఆమిదాక్ష్యబంధాలు తెగినట్లే, పశువుల బంధాలుకూడా తెగలబడిపోయాయి.

అరేయ్ మణిభూమిపైన తగల పెట్టేయండి.

బంటో౯్రతుల యమకింకరులాగ బయలు దేరారు.

భద్రం! తగలబెట్టేది నాభూమికాదు; నీభూమి. బాధ పడేది నేనుకాదు, నీవే— 'సత్యంగురించి నేను పోరాడే పోరాటంలో లోకంఅంతా ఒకటికావచ్చు, నేను ఒక్కడనే,ఒకటికావచ్చు. కాని నేను పోరాడకుండా మానను. ఒంటిగానే పోరాడగలను. అని మనగాంధీమహాత్ముడు చెప్పినమాటలు మరచి పోకు.

అలాగే పిరికివాళ్ళ ఈఅమాయకులంతా నీకు లొంగినా, నేను లొంగననుకో— స్వతంత్రం గురించి నాప్రాణాలయినా, విడిచేస్తాననుకో. నాపొలాన్ని తగలపెట్టినా నీకక్ష తీరకపోతే- నాప్రతిఅవయవం ముక్కలు ముక్కలు చేసి ఆమంటలో వేళ్ళేయ్. భయపడను—

భద్రం—ఈమణి ఊహించేది వెనుకేం జరిగిందో అని కాదు, ముందేం జరగాలో అని— చూచేది ముందుకే, వెనుకకు కాదు—నడిచేది ముందుకే, వెనుకకుకాదు.

"వేయివోయ్ మగవాడ ముందడుగు వేయివోయ్'

వేయవోయ్

ముందడుగు వేయవోయ్,

వెనుక పడితే

వెనుకేనోయ్—'

ఆమె ఆమాటలంటూ గంభీరమూర్తియై ఏకాకి లాగ వెళ్లిపోతూంది.

తాను చెమటూడ్చి పెంచి పోషించిన వరిపొలం పక్క నుంచి వెళ్లిపోతూంది.

పొలంఅంతా 'భగ్గుభగ్గు'' మని మండిపోతూంది.

ఆమె పొలాన్ని నలుగురుతగల బెడుతూన్నారు. వారి వద్దకు వెళ్లింది.

'బాబూ! ఇది ఎవరి పొలం?'

నీపొలమేగా.

కాదు మీపొలం.

మాపొలమా!

కాదు మనపొలం,

"ఆఁ!"

,,అహాహా! అహాహా! బాబూ! గాంధీజీలా ముందడుగు వేయండి. వెనుకపడితే వెనకే— విషయాలు తెలుసుకొని ముందడుగు వేయండి- కాళ్ళేభూమి నాదికాదు, మీదే. ,,మీదే—''

ఆమె వెఱ్ఱిగా నవ్వుతూ ఆమె పెంచిన వరి తగలబడి పోతూంటే చూస్తూ ఆఊరు విడిచిపెట్టి ఏకాకియయి వెళ్లి పోతూంది,

ఎక్కడికి-?

నిర్మలానంద సీమకు—

ఎందుకు-?

స్వతంత్ర్య సముపార్జనకు—

ఎలా-?

ముందడుగు వేసి—

శభాష్! భారతనారీ! శభాష్!

అందుకో తల్లీ! నాధన్యవాదాలందుకో!

నమస్సులు—

స ం పూ ర్ణ ము.

———